# అథ ఏకవింశో%ధ్యాయః

# యుద్ధఫల వర్ణనము

వ్యాస ఉవాచ |

బ్రాహ్మణత్వం హి దుష్ప్రాప్యం నిసర్గాద్బ్రాహ్మణో భ##వేత్ |
ఈశ్వరస్య ముఖాత్ క్షత్రం బాహుభ్యామూరుతో విశః || 1

సద్భ్యాం శూద్రస్సముత్పన్న ఇతి తస్య ముఖాచ్చ్యుతిః |
కిముస్థితిమధఃస్థానాదాప్నువంతి హ్యతో వద|| 2

వ్యాసుడు ఇట్లు పలికెను -

బ్రాహ్మణత్వమునుపొందుట చాల కష్టమైనది. మానవుడు స్వభావముచే బ్రాహ్మణుడు కావలెను. ఈశ్వరుని ముఖమునుండి బ్రాహ్మణుడు, బాహువులనుండి క్షత్రియుడు, తొడలనుండి వైశ్యులు,పాదములనుండి శూద్రుడు పుట్టినారని వేదము చెప్పుచున్నది. వేదము ఈశ్వరుని ముఖమునుండి పుట్టినది. క్రింది స్థాయిలో నున్నవారికి మోక్షము లభించునా? చెప్పుము (1, 2).

సనత్కుమార ఉవాచ |

దుష్కృతేనతు కాలేయ స్థనాద్భ్రశ్యంతి మానవాః | శ్రేష్ఠం స్థానం సమాసాద్య తస్మద్రక్షేత పండితః || 3

యస్తు విప్రత్వముత్సృజ్య క్షత్రయోన్యాం ప్రసూయతే |
బ్రాహ్మణ్యాత్స పరిభ్రష్టః క్షత్రియత్వం నిషేవతే || 4

అధర్మ సేవనాన్మూఢస్తథైవ పరివర్తతే | జన్మాంతరసహస్రాణి తమస్యావిశ##తే యతః || 5

తస్మాత్ప్రాప్య పరం స్థానం ప్రమాద్యన్న తునాశ##యేత్ |
స్వస్థానం సర్వదా రక్షేత్ప్రాప్యాపి విపదో నరః || 6

బ్రాహ్మణత్వం శుభం ప్రాప్య బ్రాహ్మణ్యం యో%వమన్యతే |
భోజ్యాభోజ్యం న జానాతి స పుమాన్ క్షత్రియో భ##వేత్ || 7

కర్మణా యేన మేధావీ శూద్రో వైశ్యో హి జాయతే | తత్తే వక్ష్యామి
నిఖిలం యేన వర్ణోత్తమో భ##వేత్ || 8

శూద్రకర్మ యథోద్దిష్టం శూద్రో భూత్వా సమాచరేత్ |
యథావత్పరిచర్యాం తు త్రిషు వర్ణేషు నిత్యదా || 9

కురుతే కామయానస్తు శూద్రో%పి వైశ్యతా వ్రజేత్ | యో
యోజయేద్ధనైర్వైశ్యో జుహ్వానశ్చ యథావిధి || 10

అగ్నిహోత్రముపాదాయ శేషాన్న కృతభోజనః | సవైశ్యః
క్షత్రియకులే జాయలే నాత్ర సంశయః || 11

క్షత్రియో జాయతే యజ్ఞైస్సంస్కృతైరాత్తదక్షిణైః | అధీతే
స్వర్గమన్విచ్ఛంస్త్రేతాగ్ని శరణం సదా || 12

సనత్కుమారుడు ఇట్లు పలికెను -

ఓ వ్యాసా! మానవులు పాపమును చేసినచో స్థానభ్రంశమును
పొందెదరు. కావున, ఉన్నతస్థానమునుపొందియున్న వివేకియగు
వ్యక్తి దానిని రక్షించుకొనవలెను (3). ఎవడైతే బ్రాహ్మణధర్మమును
విడనాడునో, వాడు బ్రాహ్మణత్వమునుండి భ్రష్టుడై క్షత్రియజన్మను
పొంది క్షత్రియోచితమగు కర్మలను చేయును (4). అధర్మమును
సేవించు మూర్ఖుడు ఆ విధముగనే పరిభ్రమించుచూ,
తమోగుణప్రధానమగు వేలాది జన్మలను పొందును (5).
కావున,ఉన్నతస్థానమును పొందియున్న వ్యక్తి తప్పు చేసి దానిని
చెడగొట్టునరాదు. అట్టి మానవుడు ఆపదలు వచ్చిననూ, తన
స్థానమును సర్వకాలములలో రక్షించుకొనవలెను (6). ఏ
మానవుడైతే ఏ శుభకరమగు బ్రాహ్మణత్వమును పొందియు, ఏది
తినవచ్చును ? ఏది తినకూడదు? అను విషయమునెరుంగక,
బ్రాహ్మణత్వమునకు మచ్చను దెచ్చునో, అట్టివాడు
క్షత్రియుడగును (7). మానవుడు కర్మచే
ఉత్తమవర్ణమునుపొందవచ్చును. బుద్ధిమంతుడగు శూద్రుడు

కర్మప్రభావముచే వైశ్యుడుగా కావచ్చును. ఆ వివరములను అన్నింటినీ నేను నీకు చెప్పెదను (8). శూద్రుడు తన వర్ణమునకు విధించబడిన పరచర్యను మిగిలిన మూడు వర్ణముల వారియందు సర్వదా ఆచరించవలెను (9). ఉత్తమవర్ణమును కోరు శూద్రుడు ఈ విధముగా చూసి వైశ్యుడగును. ఏ వైశ్యుడు ధనములను దానము చేయునో, యథావిధిగా హోమములను చేయునో, అగ్నిహోత్రకర్మను ఆచరించి ఆ ప్రసాదమును భుజించునో, అట్టి వైశ్యుడు క్షత్రియకులములో జన్మించుననుటలో సందేహము లేదు (10, 11). వైశ్యుడు చక్కగా యజ్ఞములను చేసి దక్షిణలను యథావిధిగా ఇచ్చినచో, క్షత్రియుడై పుట్టును. స్వర్గమునుకోరు వైశ్యుడు వేదమును అధ్యయనముచేసి, త్రేతాగ్నులను శరణు వేడి సర్వదా వాటిని ఆరాధించవలెను (12).

ఆర్ద్రహస్తపదో నిత్యం క్షితిం ధర్మేణ పాలయేత్ | ఋతుకాలాభిగామీ చ స్వభార్యాధర్మతత్పరః || 13

సర్వాతిథ్యం త్రివర్గస్య భూతేభ్యో దీయతామితి |
గోబ్రాహ్మణాత్మనో% ర్థం హి సంగ్రామాభిహతో భ##వేత్ || 14

తేనాగ్నిమంత్రపూతాత్మా క్షత్రియో బ్రాహ్మణో భ##వేత్ | విధితో బ్రాహ్మణో భూత్వా యాజకస్తు ప్రజాయతే || 15

స్వకర్మనిరతో నిత్యం సత్యవాదీ జీతేంద్రియః | ప్రాప్యతే విపులస్స్వర్గో దేవానామపి వల్లభః || 16

బ్రాహ్మణత్వం హి దుష్ప్రాప్యం కృచ్ఛ్రేణ సాద్యతే నరైః |
బ్రాహక్మణ్యాత్సకలం ప్రాప్య మోక్షశ్చాపి మునీశ్వర || 17

తస్మాత్సర్వప్రయత్నేన బ్రాహ్మణో ధర్మతత్పరః | సాధనం సర్వవర్గస్య రక్షేద్బ్రాహ్మణ్యముత్తమమ్ || 18

క్షత్రియుడు చేతులను, కాళ్ళను కడుగుకొని పవిత్రస్థలములలోనికి ప్రవేశించవలెను. రాజ్యమును ధర్మబద్ధముగా పాలించవలెను. తన భార్యతో ఋతుకాలములో రమించవలెను. ధర్మమునందు పూర్ణశ్రద్ధనుకలిగియుండవలెను (13). క్షత్రియుడు

ధర్మార్థకామములనే పురుషార్థములను కోరి సర్వప్రాణులకు ఆహారమునీయవలెను. గోవులను, బ్రాహ్మణులను, మరియు తనను రక్షించుకొనే ప్రయత్నములో క్షత్రియుడుయుద్ధములో శత్రువులను ఎదిరిస్తూ ప్రాణములను విడిచినూ మంచిదే (14). ఈ విధముగా అగ్ని చేత మరియు మంత్రములచేత పవిత్రమైన అంతఃకరణము గల క్షత్రియుడు బ్రాహ్మణుడగును. అతడు బ్రాహ్మణుడైన తరువాత యథావిధిగా యజ్ఞమును చేయును (15). అతడు నిత్యము తన ధర్మమును నిర్వర్తించి ఇంద్రియజయముగలవాడై సత్యమును పలుకుతూ జీవించి మరణించిన తరువాత విశాలమగు స్వర్గమును పొందినవాడైదేవతలకు ప్రీతిపాత్రుడగును (16). ఓ మహర్షీ! మానవులు మిక్కిలి క్లేశముచే పొందదగిన బ్రాహ్మణత్వమును కష్టపడి పొందెదరు. మానవుడు బ్రాహ్మణత్వము యొక్క ప్రభావముచే మోక్షముతో సహా సర్వమును పొందగల్గును (17). కావున, బ్రాహ్మణుడు ధర్మమునందు నిష్ఠ గలవాడై, చతుర్విధపురుషార్థములకు సాధనమైన ఉత్తమమగు బ్రాహ్మణత్వమును రక్షించుకొనవలెను (18).

వ్యాస ఉవాచ |

సంగ్రమాస్యేహ మహాత్మ్యం త్వయోక్తం మునిసత్తమ |
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం బ్రూహి త్వం వదతాం వర || 19

వ్యాసుడు ఇట్లు పలికెను -

ఓ మహర్షీ! నీవు యుద్ధము యొక్క మహిమను చెప్పియుంటివి. నేను దానిని వినగోరుచున్నాను. నీవు వక్తలలోగొప్ప వాడవు. దానిని చెప్పుము (19).

సనత్కుమార ఉవాచ |

అగ్నిష్టోమాదిభిర్యజ్ఞైరిష్ట్వా విపులదక్షిణైః | న తత్ఫలమవాప్నోతి సంగ్రామే యదవాప్నుయాత్ || 20

ఇతి తత్త్వవిదః ప్రాహుర్యజ్ఞకర్మవిదస్సదా | తస్మాత్తత్తే ప్రవక్ష్యామి యత్ఫలం శస్త్రజీవినామ్ || 21

ధర్మలాభో%ర్థలాభశ్చ యశోలాభస్తథైవ చ | యశ్శూరో వాంఛతే యుద్ధం విమృందన్ పరవాహినీమ్ || 22

తస్య ధర్మార్థకామాశ్చ యజ్ఞశ్చైవ సదక్షిణః | పరం హ్యభియుఖం దత్త్వా తద్యానం యో%ధిరోహతి || 23

విష్ణులోకే స జాయతే యశ్చ యుద్ధే%పరాజితః | అశ్వమేధానవాప్నోతి చతురో న మృతస్స చేత్ || 24

యస్తు శస్త్ర మనుత్సృజ్య మ్రియతే వాహినీముఖే | సమ్ముఖో వర్తతే శూరస్స స్వర్గాన్న నివర్తతే || 25

రాజా వా రాజపుత్రో వా సేనాపతిరథాపి వా | హతః క్షత్రేణ యశ్శూరస్తస్య లోకో%క్షయో భ##వేత్ || 26

యావంతి తస్య రోమాణి భిద్యంతేసై#్రర్మహాహవే | తావతో లభ##తే లోకాన్ సర్వకామదుఘా%క్షయాన్ || 27

వీరాసనం వీరశయ్యా హీరస్థానస్థితిః స్థిరా | సర్వదా భవతి వ్యాస ఇహ లోకే పరత్ర చ || 28

గవార్థే బ్రాహ్మణార్థే చ స్థానస్వామ్యర్థమేవ చ | యే మృతాస్తే సుఖం యాంతి యథా సుకృతినస్తథా || 29

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

క్షత్రియుడు యుద్ధము ద్వారా పొందే ఫలమును మిక్కుటమగు దక్షిణలతో కూడిన అగ్నిష్టోమము మొదలైన అనేక యజ్ఞములను చేసిననూ పొందజాలడు (20). యజ్ఞమును, కర్మస్వరూపమును యెరింగిన జ్ఞానులు ఈ విధముగా చెప్పుచున్నారు. కావుననే. శస్త్రముతో ప్రజలనురక్షిస్తూ లభించే ఫలమును గురించి నేను నీకు చెప్పుచున్నాను (21). ఏ శూరుడైతే యుద్ధమునుకోరి శత్రుసైన్యమునుకకావికలుగా చేయునో, వానికి ధర్మార్థములు మాత్రమే గాక, కీర్తి కూడ లభించును (22). ఎవడైతే శత్రువును ఎదుర్కొని యుద్ధమును చేసి వాని రథమును తన వశము చుసుకొని దానిని తాను అధిరోహించునో, వానికి

ధర్మార్థకామమములు మాత్రమే గాక, దక్షిణతో కూడిన యజ్ఞయును చేసిన ఫలములభించును (23). యుద్ధనిపుణుడగు క్షత్రియుడు యుద్ధములో పరాజయమును గాని, మరణమును గాని పొందకుండగా విజయమును పొందినచో, వానికి నాలుగుఅశ్వమేధములను చేసిన ఫలము లభించి,అతడు మరణించిన తరువాత విష్ణులోకమును పొందును (24). ఏ వీరుడైతే తన చేతలోని ఆయుధమును విడిచిపెట్టకుండగా శత్రుసైన్యమునకు ఎదురుగా నిలబడి ప్రాణములను విడుచునో, అతడు స్వర్గమునుండి మరలి రాడు (25). శూరుడగు రాజు గాని,రాజకుమారుడు గాని, సేనాపతి గాని, ధర్మయుద్ధములో మరణించినచో, వానికి నాశము లేని పుణ్యలోకములు లభించును (26). యుద్ధములోఅతని శరీరములోని ఎన్ని రోమములు అస్త్రములచే నశింపచేయబడునో, వానికి అన్ని నాశము లేని,కోరికలను అన్నింటినీ ఈడేర్చే లోకములు లభించును (27). ఓ వ్యాసా! అతనికి ఇహలోకములో మాత్రమే గాక, పరలోకములో కూడ వీరునకు తగిని ఆసనము, శయ్య, స్థానము, స్థిరమగు పదవి సర్వకాలములలో లభించును (28). ఎవరైతే గోవుల కొరకు, బ్రాహ్మణుల కొరకు, తన దేశము కొరకు, మరియు ప్రభువు కొరకు ప్రాణములను విడిచిపెట్టునో, వారు మరణించిన తరువాత పుణ్యాత్ములవలె సుఖములను బడయుదురు (29).

యః కశ్చిద్బ్రాహ్మణం హత్వా పశ్చాత్ప్రాణాన్ పరిత్యజేత్ | తత్రాసౌ స్వపతేర్యుద్ధే స స్వర్గాన్న నివర్తతే || 30

క్రవ్యాదైర్దంతిభిశ్చైవ హతస్య గతిరుత్తమా | ద్విజగోస్వామినామర్థే భ##వేద్విపులదాక్షయా || 31

శక్నోతీహ సమర్థశ్చ యష్టుం క్రతుశ##తైరపి | ఆత్మదేహపరిత్యాగః కుర్తుం యుధి సుదుష్కరః || 32

యుద్ధం పుణ్యతమం స్వర్గ్యం రూపజ్ఞం సర్వతోముఖమ్ | సర్వేషామేవ వర్ణానాం క్షత్రియస్య విశేషతః || 33

భృశం చైవప్రవక్ష్యామి యుద్ధధర్మం సనాతనమ్ | యాదృశాయ ప్రహర్తవ్యం యాదృశం

పరివర్జయేత్ || 34

ఆతతాయినమాయాంతమపి వేదాంతగం ద్విజమ్ | జిఘాంసంతం జిఘాంసేత్తు న తేన బ్రహ్మహా భ##వేత్ || 35

హంతవ్యో%పి న హతవ్యం పానీయం యశ్చ యాచతే | రణ హత్వాతురాన్ వ్యాస స నరో బ్రహ్మహా భ##వేత్ || 36

వ్యాధితం దుర్బలం బాలం స్త్ర్యనాథౌ కృపణం ధ్రువమ్ | ధనుర్భగ్నం ఛిన్నగుణం హత్వావై బ్రహ్మహా భ##వేత్ || 37

ఏవం విచార్య సద్ధీమాన్ భ##వేత్త్రీప్త్యా రణప్రియః | స జన్మనః ఫలం ప్రాప్య పరత్రేహ ప్రమోదతే || 38

ఇతి శ్రీ శివమహాపురాణ   ఉమాసంహితాయాం రణఫలవర్ణనం నామ ఏకవింశో%ధ్యాయః (21).

బ్రహ్మహత్యను చేసినవాడైననూ తన ప్రభువు తరపున యుద్ధమును చేయుచూ ప్రాణములను విడిచినచో, అతడు స్వర్గమునుండి మరలి రాడు (30). బ్రాహ్మణులు, గోవులు మరియు ప్రభువు అను వారి రక్షణ కొరకై క్రూరమృగములచేత గాని, ఏనుగుల చేతగాని సంహరింప బడినవానికి విశాలమైన వినాశము లేనిఉత్తమమగు పుణ్యలోకము లభించును (31). ఈ లోకములో మానవుడు వంద యజ్ఞములను చేసే సామర్ధ్యమును కలిగియుండ వచ్చును. కాని,యుద్ధములో ప్రాణములను విడనాడుట చాల క్లేశముతో కూడిన పని (32). యుద్ధయు సర్వవర్ణముల వారికి, విశేషించి క్షత్రియునకు మహాపుణ్యమును ఇచ్చి స్వర్గలోకమును పొందింపచేయును. మానవుని సర్వతోముఖమగు ప్రతిభ యుద్ధములో వ్యక్తమగును (33). నేనిప్పుడు శాశ్వతమైన యుద్ధధర్మమును సుస్పష్టముగా చెప్పెదను. ఎవరిని యుద్ధములోశస్త్రముతో కొట్టవచ్చును ?ఎవరిని కొట్టరాదు ? అను విషయమును ఈ ధర్మము నిర్దేశించును (34).

వేదాంతమునెరింగిన బ్రాహ్మణుడైననూమహాపాపములనుచేసినవాడై సంహరించే ఉద్దేశ్యముతో మీదకు వచ్చుచున్నచో, వానిని సంహరించవలెను. దాని వలన బ్రహ్మహత్యాదోషము సంక్రమించదు (35). సంహరింప దగిన వ్యక్తియైననూ దాహబాధతో నీటినిఇమ్మని కోరినచో, వానిని సంహరించరాదు. ఓ వ్యాసా! అట్లు సంహరించినచో, బ్రహ్మహత్యాదోషము సంక్రమించును (36). రోగగ్రస్తుని,నీరసించి యున్నవానిని, చిన్న పిల్లవానిని, స్త్రీని, అనాథుని, దీనుని, విరిగిన ధనుస్సు గలవానిని, తెగిన నారిత్రాడు గలవానిని చంపినచో, నిశ్చయముగా బ్రహ్మహత్యాదోషము చుట్టుకొనును (37). బుద్ధిమంతుడగు వ్యక్తి ఈ విషయములను అన్నింటినీ విచారించి యుద్ధమునందు ప్రీతిని కలిగియుండవలెను.అట్టి వ్యక్తి ఇహలోకములో మానవజన్మయొక్క సాఫల్యమును పొంది పరలోకములోఆనందముననుభవించును (38).

శ్రీ శివమహాపురాణంలోని ఉమాసంహితయందు యుద్ధఫలవర్ణనము అనే ఇరువది ఒకటవ అధ్యాయము ముగిసినది (21).